7

శుక్ల వసంతం ❋ SPRING 1989

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



# చైత్రరథం

**7**

శుక్ల వసంతం ✻ SPRING 1989

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

✻

చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
April 1989, pp. vi + 56.

ముఖచిత్రం : కవి, పరిశోధకుడు, విమర్శకుడు అన్నీ అయిన ఆరుద్ర

వెనుక వైపు : ఆంధ్రుల విలక్షణ కవి, విప్లవ ఋషి నారాయణ బాబు

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

వెల : రూ. 10-00 (వార్షిక సభ్యత్వం రూ. 15-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

**Prof. T. V. Subba Rao**
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
I.K.S., University of Mysore,
Manasagangotri, Mysore-570 006

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8

# శక్తారంభం

కొత్త యుగాదిలోకి అడుగుపెడ్తూ 'చైతన్య కవిత' నిర్విఘ్నంగా కల కాలం వెలువడేందుకు తగిన వనరుల్ని సమకూర్చుకోడానికి ప్రయత్నిసున్నాం. మూడు వసంతాలు చూచి నాలుగో వసంతంలో అడుగు పెడ్తున్న ఈ కవిత్వ పత్రిక సహృదయుల చల్లని మాటల పన్నీటి జల్లుల్ని తలచుకుంటున్నది. కొందరు పనిగట్టుకొని దూషించక పోలేదు మారు పేర్లతో పత్రికల్లో సమీక్షలు రాసి తూలనాడక పోలేదు. అదే పనిగా కొందరిని ప్రేరేపించి రాయించకనూ పోలేదు. మంచిని మెచ్చుకొని, నిర్మాణాత్మకమైన సలహాలనిచ్చే సమీక్షకులు, సహృదయులు ఆంధ్రుల్లో అరుదై పోతున్నారా అనిపిస్తుంది. అయినా పరవాలేదు. సాహిత్య రాజకీయాల్లో సాధ్యమైనంతవరకు తలదూర్చకుండా మా పని మేము చేసుకుపోవాలనుకుంటున్నాం.

భోపాల్‌లో జరిగిన ప్రపంచ కవుల సమావేశం సందర్భంగా వెలువడిన ఆరుఖండాల కవితా సంకలనంనుంచి కొన్నిటిని అనువాదం చేయించి ఈ సంచికలో ప్రచురిస్తున్నాం. పోయిన సంచిక అట్టవెనుక ప్రచురించిన అపురూపమైన ఛాయాచిత్రాన్ని (కృష్ణశాస్త్రి–శ్రీశ్రీ) దయతో ఇచ్చిన డా కోవెల సుప్రసన్నగారికి, ఈ సారి ప్రచురించిన నారాయణ బాబుగారి చిత్రాన్ని దయతో పంపిన శ్రీ సోమసుందర్‌గారికి కృతజ్ఞతలు. ఈ కవిత్వ పత్రిక పట్ల కవి మిత్రులు చూపిస్తున్న ఆదరాభిమానాలకు మా ధన్యవాదాలు.

సంపాదకులు

# ఈ వసంత కవివతంసులు

శ్రీయుతులు పుట

## అనువాద కవిత

## అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చేసే కవితాముద్ర ఆరుద్ర

—రామమోహన్‌రాయ్

"కవితకోసమె నేను పుట్టాను
క్రాంతికోసము కలము పట్టాను
ఎండ మావులు బెరిపి పండువెన్నెల నిలిపి
గుండె వాకిలి తలుపు తట్టాను"

అని నిశ్చయంగా, నిబ్బరంగా పలికి తెలుగువారి గుండె తలుపులు తెరిచి అందులో తన కవితారూపాన్ని స్థిరంగా నిలిపిన కవి శ్రీ ఆరుద్ర. బహుముఖ ప్రజ్ఞాశాలి అనే మాట ఆరుద్రపట్ల సార్థకమైనంతగా ఇప్పుడు జీవించివున్న సాహిత్యవేత్త లెవ్వరిపట్లా సార్థకం కాదు. రసవంతమైన కవిత్వం, అవిరామ సాహిత్యకృషి, నిరంతర అధ్యయనం, విసుగులేని పరిశోధన, సత్యాన్వేషణ, అమేయమైన భావనా పటిమ, అసామాన్యమైన వాక్చమత్కృతీ ఆరుద్రలో కన్పించే విశిష్ట గుణాలు. "నీలాల నింగిలో ఎర్ర జండాతోడ/ఎర్ర జండాతోడ/నీలాల నింగిలో/కొత్త మార్గాలకై" (1942) అన్వేషణ ప్రారంభించిన ఆరుద్ర ఇటీవలే రచిస్తున్న "నాలోపల ఒక నది ఉన్నది"దాకా కవితలో పండు వెన్నెల కాయిస్తూనే ఉన్నారు. త్వమేవాఽహమ్, సినీవాలి, కవితలు (విపుల సంకలనం) అన్నిటిలో ఆరుద్ర కవిత్వంతో పాటు కవితాశిల్పం వదలుకోని గడుసరి. తెలంగాణ దయనీయ గాథను 'త్వమేవాఽహమ్' చదివి తెలుసుకోవటం కష్టమని కొందరు పాఠకులిప్పటికీ వాపోతూనే ఉన్నారు. ఏ కాలంలోనైనా కవిత్వం శిల్పాన్ని వదిలి ఉన్నదా? జన జీవితం సంక్లిష్టమైనప్పుడు కవి ఆ క్లిష్టతను, సంక్షోభాన్ని వర్ణించటానికి దానికి తగిన శిల్పాన్నే ఎంచుకుంటే తప్పేమున్నది? యాంత్రికమైన నగర జీవితాన్ని వర్ణించాలంటే వసంత కోకిలలు, మలయానిలాలు పనికి రానట్లే గుండెలవిసి పోయే కష్టగాథలను ఆరుద్ర తగిన శిల్పనైపుణ్యంతోనే వెల్లడించారు. శీర్షికకూడా సాధారణమైనదిగా 'తెలంగాణా' అని ఉండ కూడదనే ఉద్దేశంతోనే శ్రీశ్రీ దాన్ని 'త్వమేవాఽహమ్' అని మార్చారు. "టెక్నిక్ లేని కవిత్వాన్ని ఊహించలేను. ప్రత్యేక సంవిధానరహిత వాక్య సందోహాన్ని

వాక్శుద్ధి- ధారావైదుష్యాలని పోనాడని మాటల దొంతరని నేను కవిత్వంగా ఎంచలేను" "అని ఆరుద్ర అనాడన్న మాటలు నేటికీ జ్ఞాపక ముంచుకో దగినవే." "తెలంగాణ ఆంధ్రకి నాయకత్వం వహించేట్టు కనబడుతుంది" అని ఆరుద్ర అప్పుడన్న మాటలు సత్యమేనని ఇటీవలి విప్లవ పోరాటాలు నిరూపించాయి. "మన స్వతంత్రం మేడిపండు/మన దరిద్రం రాచపుండు" అని పలికిన కవి వాక్కు అమోఘమైనది కాదా! కాబట్టే ఆరుద్ర 'వెయ్యి వోల్టుల కవిత్వం' రచించారు. వెయ్యి వోల్టుల కవిత్వం రచించిన చేత్తోనే "కూనలమ్మ పదాలు; ఇంటింటి పజ్యాలు, శుద్ధ మధ్యాక్కరలు" వ్రాసి దేశీయమైన ఛందస్సులలో వచన కవిత్వంలో, పద్యంలో అనితర సాధ్యమైన శైలిని ప్రదర్శించారు "ఆరుద్ర తన ఛందస్సుల చేత అందంగా చాకిరీ చేయించుకో గలడు", అన్న శ్రీశ్రీ ప్రశంస ఏ మాత్రం అతిశయోక్తి కాదు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ఆరుద్రనుగూర్చి "ఇతను పూర్తిగా కొత్త అవరణలో నిలబడ్డవాడు, చురుకైన భావన ఉన్నది ఇతనికి. 'మియ్యోఁయ్ మియ్యోఁయ్' వంటి మంచి గేయ కావ్యాలు చాలా వ్రాస్తున్నాడు. కవిత్వ రహస్యం తెలిసినవాడు; కనుక కావ్య నిర్మాణానికి అవసరమైన శిల్పం వదులుకోని గడసరి" అని 1949లోనే పలకటం గమనార్హం. ఆరుద్ర కవిత్వాన్ని శిల్పాన్ని వేర్వేరుగా చూడకూడదు. ఆరుద్ర కవన శిల్పం పైన పఠాభి, అజంతా ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది.[1] అయితే వాళ్ళిద్దరు దారి తీయని దేశి ఛందస్సులలో ఆరుద్ర ఆరితేరిన వాడై తన రథాన్ని ముమ్ముందుకు సాగించారు. పఠాభి అజంతాలు అంతర్ముఖులై కవిత్వాన్ని అతి విలువైన పదార్థంగా కొద్ది కొద్దిగానే వెలువరిస్తే ఆరుద్ర ఆంధ్రదేశంలో ప్రజా సమస్యలన్నిటికీ పోరాటాలన్నిటికీ కవిగా స్పందించారు. "ఆకాశం చల్దికూడ/వెన్నెల తరవాణిలో/ఉన్నదొకే ఒక్క పిడచ/కుండనంటి పెట్టుకున్నవి/రెండో మూడో మెతుకులు" అని నారాయణబాబు ప్రభావంతో అభ్యుదయ కవిత్వ రచనకు పూనుకున్నప్పుడుగాని, చెన్నరాజధానిలో పదిలక్షల టన్నుల ఆహారపు కొరత ఏర్పడినదని విని 'భూతపు గోళ్ళు' రచించినప్పుడుగాని ఆరుద్ర ప్రజలకవే. ప్రతి పండుగకు ప్రజలకేదో

---

1 సంపాదకులలో ఒకరైన తంగిరాల 1-3-1989న బెంగుళూరుతో ఆరుద్రగారిని స్వయంగా కలిసి ఈ విషయం వారి దృష్టికి తీసుకువచ్చారు. "నా మీద పఠాభి ప్రభావం ఉంది, ఒప్పుకుంటున్నాను. కాని అజంతా ప్రభావం మాత్రం లేదు. అజంతా నా కన్నా చాలా చిన్నవాడు" అన్నారు ఆరుద్ర (సంపాదకులు).

చెప్పాలని ఆవేశరహితమైన కవితలు రచించే 'కేలండర్ కవి' కాడు. కవిత్వాన్ని రోజా వాడని 'టూత్ బ్రష్'గా భావించినవాడు. హరీంద్రనాథ చటోపాధ్యాయ విజయవాడనుండి పార్లమెంటుకు పోటీ చేసినప్పుడు 'పరపీడన పోలేదని కవులంతా గుర్తించిరి" అని ఆరుద్ర హెచ్చరించి హరీన్‌ను గెలిపించమని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

అభ్యుదయ కవిత్వం మంటపూలు పూస్తున్నప్పుడు అభ్యుదయోద్యమం శక్తిని కోల్పోతున్నప్పుడు "ఉద్యమ నాయకా! చదువుకో" అని మహాకవి శ్రీశ్రీని హెచ్చరించిన ఆరుద్ర 'సొమ్ములు దోచుకుంటున్నారు ఇప్పుడు రథాన్ని మళ్ళించకయ్యా!" అన్నారేగాని తన రథం కూరుకుపోయిన సంగతిని గుర్తించలేదు. 1955–1965 మధ్యకాలంలో ఆంధ్రసాహిత్యాన్ని స్తబ్ధత ఆవరించినప్పుడు ఆరుద్ర తన లక్ష్యాన్ని విడిచి పెట్టి చేదుపాటలు పాడారు. "రాబందుల రాజ్యం లోపల/ఆంబోతులే అమాత్యులు కదా మరి" అని అక్కసును వెళ్లగక్కినా అవి గాయాల్ని కదుపుతున్న గేయాలే అయ్యాయి. "ఈ పొలము నీదే ఈ హలము నీదే" అని కష్టజీవికి అభయమిచ్చిన కవి తన ప్రయాణంలో తప్పిపోయారు. మార్క్సిజానికి దూరమై "దివ్యంగా చెప్పాడు రుషి ఎమ్మెన్. రాయి/నవ్య మానవవాదం రేపటి గీటురాయి" అని రాయిజం వైపు మరలారు. దానిలోనూ పూర్తిగా యిమడలేక ఊహకందని మానవతావాదం వైపు మొగ్గారు. తర్వాత కొన్నాళ్లు రాజకీయ పార్టీలతో ప్రమేయం లేని స్వతంత్ర ప్రతిపత్తిగల అభ్యుదయ రచయితల సంఘం కావాలని ఉవ్విళ్లూరారు. ఆ ఆశ అడియాస అయింది. ప్రజాశ్రేయస్సనే మణి పూస చేజారింది.

ఆరుద్ర తన కవితాలక్ష్యాన్ని దారికి మళ్లించుకొన్నది 1970లో విప్లవ రచయితల సంఘం ఏర్పడిన తర్వాతే నని చెప్పాలి. విప్లవవాదులు ప్రతిపాదించిన సాయుధ పోరాటం ఆరుద్రకు నచ్చలేదు. నక్సల్బరీ పద్ధతిని అనుసరిస్తున్న విప్లవవాదులను హెచ్చరిస్తూ ఆరుద్ర—

"నక్సలైటూ కలిసి రావయ్యా
నవశక్తి యువశక్తి తేవయ్యా
విడిదుడుకు వైదాలు విధ్వంసనోగ్రాలు
విప్లవమ్మని తలచలేనయ్యా!
ప్రజలు లేవని వరకు ఫలితముండదు కడకు
ప్రజల విముఖుల చేయవలదయ్యా"

అని అభ్యర్థించారు. కాని విప్లవం విందుభోజనం కాదని, ప్రతిపక్షాలు మిత్రపక్షాల పేరుతో పాలక వర్గాల పంచన చేరి ఎన్నికల గారడీలో కప్పల తక్కెడగా మారినప్పుడు అవకాశవాదాన్ని అవలంబించినప్పుడు ఆరుద్ర చైతన్యవంతమైన నిద్రపోయారు. ఎమర్జన్సీలో ''రైళ్ళు నడుస్తున్నాయి, ఫైల్లు నడుస్తున్నాయి" అని తాత్కాలిక మార్పుకు చంకలు గుద్దుకునే వైఖరి నవలంబించి ఆరుద్ర తనకవిత్వంపై ఒక మచ్చను తెచ్చుకున్నారు.[2]

ఆరుద్ర ప్రతిభ అతిగాఢమైనది అంత్య ప్రాస ఆరుద్ర ముద్ర—అది తెచ్చి పెట్టుకున్నది కాదు. ప్రేమ గీతాలు రచించినా సినిమా పాటలు రచించినా నాలుగు కాలాల పాటు నిలిచివుండేవే గాని ఆషామాషీ రచనలు కావు. "ఎడబాటంటే ఎదలో ముల్లు అని అలవోకగా అనగలిగిన కవి ప్రతిభ దేదీప్య మానమైనది–''నువ్వెక్క దలచుకొన్న రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు'' అనే పంక్తి కాలాన్ని దాటి ఇరవైయొకటో శతాబ్దంలోకి ప్రయాణించగలిగినది. కవిత్వంలో ఎపిగ్రామ్స్ ఏరటం జరిగితే ఆరుద్ర రచించినవే అధికంగా లభిస్తాయి.

'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' కవి ఆరుద్ర పరిశోధకుడై వెలువరించిన గొప్ప రచన విశ్వవిద్యాలయాలెన్నో చెయ్యలేని పనిని ఒక్క చేతిమీదిగా సాధించారు (త్వరగా పూర్తి కావాలి). నెరసున్న లెన్నవలసివస్తే గ్రహింపరు జాణలు జారు పాటులను!

శ్రీశ్రీ ఆరుద్ర వరదరాజేశ్వరరావుల సాహిత్యోపనిషత్ ఆంధ్ర సాహిత్యంలోనే అపురూపమైన రచన; కవిత్వ నికషోపలం. ''కలనిజపరచటం కాదు కవిత్వం నిజాన్ని కలగనడమేదాని తత్త్వం'' అనే ఆరుద్ర నిర్వచనం ఆయన దర్శనాన్ని పట్టియిచ్చే చక్కని సూక్తి.

ఆరుద్ర కథలు, నాటికలు, అనువాదాలు, పరిశోధన వ్యాసాలు ఆయన కీర్తికిరీటంలో కలికి తురాయిలు. ఇంద్రజాలం, చదరంగం, గళ్ళనుడికట్టు, స్థలనామాలు, శాసన పరిశోధన, ఆంత్రోపాలజీ, ప్రీహిష్టరీ ఇంకామరెన్నో విషయాలపై ఆరుద్ర అభినివేశం అచ్చెరువు గొలుపుతుంది. ఆరుద్ర రచన

---

2 ముందు తెల్పిన ముఖాముఖిలోనే ఆరుద్రగారు ఈ విషయాన్ని గురించి ఇలా అన్నారు: ''రైళ్లు నడుస్తున్నాయి.... ఫైళ్లు నడుస్తున్నాయి.... కాని జీవితం నడవటం లేదు–అని నా భావం. రామమోహనరాయ్‌గారు నా భావాన్ని అర్థం చేసుకోలేదు.''

లన్నీ ఒకచో చేర్చి చూస్తే సాహితీ సముద్రుడనే మాట అతిశయోక్తిగా విన్పించదు.

ఆస్తికంటె గ్రంథ సంచయమే గొప్ప ఆస్తిగా, సాహితీ పరమార్థాన్ని సాధింప జేసి ఉత్తమ పురుషార్థాన్ని సాధించటానికి తోడ్పడిన సహధర్మచారిణి రామలక్ష్మి సాహచర్యం భాగ్యంగా, సంతతిని కావ్య సంతతిని రెండు కళ్లగా భావించే ఆరుద్ర ధన్యజీవి. తెలుగు సాహిత్యంలో తలపైకెత్తి చూడవలసిన విరాణ్మూర్తి. "మంచికవిత నిలబడితె మరణం భయపడుతుంది." ఆరుద్ర కవిత జరామరణ భయంలేనిది. కాలంగడిచే కొద్దీ పరిమళాలు వెదజల్లే పారిజాత ప్రసవం; ప్రజాశ్రేయస్సునుకాంక్షించిన ఆయన కవితను ప్రజలు శిరసావహిస్తారు.

* * * *

"కాలం మన ఆశల ప్రశ్నలకి జవాబు
కాలం మన ఆశయాలకి పెద్ద సవాలు"

"ఒక పదంలో ఇముడవలసిన అర్థం
కొన్ని వాక్యాల విస్తీర్ణతను
దురాక్రమణ చేస్తుంది"

"నువ్వు ఎక్కదలచుకొన్న రైలు
ఎప్పుడూ ఒక జీవిత కాలం లేటు"

"కరి మింగింది వెలగ పండు,
కాదు కాదంటే పోనిండు
మన స్వతంత్రం మేడిపండు
మన దరిద్రం రాచపుండు."

# ఆరుద్ర

| | |
|---|---|
| అసలు పేరు : | భాగవతుల సదాశివ శంకర శాస్త్రి |
| పుట్టిన తేదీ, స్థలం : | 31-8-1925, విశాఖపట్నం |
| విద్యాభ్యాసం : | మిసెస్ ఎ వి.న్. కాలేజీ స్కూలు, విశాఖ; ఎం. ఆర్. కాలేజి, విజయనగరం (క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో చదువుకు స్వస్తి) |
| ఉద్యోగాలు : | రాయల్ ఇండియన్ ఏర్ ఫోర్స్ (1943-46)<br>ఆనందవాణి సంపాదకుడు (1947-48) |
| రచనలు : | 1939 నుంచి రచనా వ్యాసంగం.<br>త్వమేవాహం (1949); గాయాలు-గేయాలు (1957); ఆరుద్ర నాటికలు (1954); 'నేను చెప్పానుగా' (1958); ఆరుద్ర కథలు (1968); సినీవాలి (1960); కూనలమ్మ పదాలు (1964); ఎంచిన పద్యాలు (1965); వెన్నెల-వేసవి (1968); హైలా పచ్చీసు (1967); కొండగాలి తిరిగింది (1975); రాముడికి సీత ఏమవుతుంది (1978); చదరంగం (1981); ఏటి కేడాది (1979); మహనీయులు (1979); సాలభంజిక (1979) ; వ్యాసపీఠం (1985), గురజాడ గురుపీఠం (1985) మొదలయినవి. |
| సినిమారంగం : | 1949లో చలనచిత్రరంగ ప్రవేశం, పాటలు, కథలు, సంభాషణలు 500 చిత్రాలకు; 4,500 పాటలు |
| బహుమతులు : | ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ అవార్డు-1974; డాక్టర్ ఆఫ్ లెటర్స్, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం 1985; కళాప్రపూర్ణ-ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1985; కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు-1987 మొదలైనవి. |
| చిరునామా : | 1, శివప్రకాశ ముదలి వీధి, టి. నగర్, మద్రాసు-600 017. |

# డాక్టర్ ఆరుద్ర

## మహాభియానం

నాలో ఒకనది ఉన్నది
ఆలోచన సుడి ఉన్నది
కాలార్ణవ లోలాంతర
హాలాహల సుధ ఉన్నది

ఆగత అనాగతాల వీక్షించే
అత్యద్భుత మణి ఉన్నది
ఆగతం అనాది
అనాగతం అనంతాల గాది
అనాదికి ముందు నేను
అంచనాకు అందనంత వేగంతో
రోదసిలో పయనించే నిప్పులకుప్పను
మేదినిగా పుట్టి పెరిగి ఇప్పుడు
నా కోసం నేను పరిశ్రమిస్తున్నాను
నా చుట్టూ నేను పరిక్రమిస్తున్నాను
నాన్నో తల్లో నాకు తెలియని సాల్తీ చుట్టూ
ఎన్నో వేల యుగాలుగా ప్రదక్షిణ చేస్తున్నాను

నాలో ఒక ఎద ఉన్నది
ఆలిస్తే సొద ఉన్నది
శిల్పాటవిలో విచ్చిన
కల్పలతిక సుమ మున్నది
ఆగత అనాగతాల నడుమ
సాగుతున్న కథ ఉన్నది
ఆగతం పరిచితమైన భ్రమ
అనాగతం విరచితంకాని శ్రమ
భ్రమల పొరలతో నేసిన

రమణీయ కల్పనల తల్పాన శయనించే బంధకిని
కట్టుకథల పుట్టగా పుట్టి ఇప్పుడు
కర్ణపుటాలలో ప్రాచీన సముద్రాలలాగు గొణుగుతున్న
మొన్నను నిన్నగా నిన్నను నేడుగా మార్చి
ఎన్నో కలల కల్లల నిజాల మజాని పిండుతున్నాను

లోలార్కుని ద్యుతి వంటిది
ఫాలాక్షుని ధృతి వంటిది
నాలో ఒక నిధి ఉన్నది
నవరసాల పొది ఉన్నది
పొదిలో శస్త్రం నిశితం
నిధిలో సంపద హసితం
స్వగతంలో గతం నిండి
స్వానుభవంలో భవం పండి
వర్తమానం తమాను కమీజుల స్ట్రిప్ టీజ్ చేసి
అస్తమానం విస్తరిస్తున్న కవితా విస్ఫూర్జితాన్ని
అనాది గతం తొలినుండి
అనంత భవిష్యత్తు కడవరకు
పయనం ఎవరిది?
అడుగడుగు బెడిదాలకు హడలి పలాయనం ఎవరిది?
ఆశయ కథనం చేస్తూ సాగే మహాభియానం మాత్రం నాది.

## మనిషి-ఆడమనిషి

ఎవడ్రా నువ్వు?
ఏమనుకుంటున్నావు నన్ను?
దానంగా నన్ను నేను నీ కిచ్చు కొంటే
దీనత్వం హీనత్వం అంటగడుతున్నావు నాకు

నీ తల్లిని నీ చెల్లిని
నీ అక్కను నీ అత్తను
నీ కూతుర్ని నీ కోడల్ని

నీ పళ్లెంలో వడ్డించే పెళ్లాన్ని
నీ దూకుడు దౌడు అరికట్టే కళ్లాన్ని
నీ బ్రతుకింటి వీధి తలుపు గొళ్లాన్ని
నిత్యం నిశ్వసించే విశ్వాసాన్ని నేను
నీ జీవితాంకం ప్రథమాశ్వాసాన్ని నేను

తల్లి లేకుండా నీ అంతట నువ్వు పుట్టావా?
ఎల్ల లేకుండా ఎనిమిది దిక్కులూ మెట్టావా?
కల్లకో ఎల్ల ఉంటుంది
ఎల్లకో గురుతు ఉంటుంది
ఎల్ల వేళలా ఎల్లను నేను
ఎల్లమ్మల ఎల్లమ్మను నేను
తల్లి భూమిని తల్లి చెట్టుని
తల్లి విత్తును తల్లి మిత్తును
నిన్ను కన్నాను కట్టుకొన్నాను
నిన్ను పెంచాను నీ తోటికి కట్ట బెట్టాను
నీ ఊడల్ని చూస్తున్నాను ఉప్పొంగి పోతున్నాను
నిన్ను నాలో రంగరిస్తున్నాను కుంగి పోతున్నాను
ఎక్కడ మొదలెట్టను మన పరస్పరగాథ
ఎలా వర్ణించను నా శాశ్వత బాధ!

నాలోంచి నేను బయటికొచ్చి
నన్ను నేను చూసుకొంటున్నప్పుడు
నా కన్నెవరో నేనెవరో
నాలో గడిచిన యుగాల నానా పురాణ గాథలు
నా చుట్టూ ఊరేగుతాయి రేగుతాయి
నేను లేకుండా నువ్వు మొలకెత్తలేవు
నేను మేను నీవు నా రేవు
నిజం మన తావు.

# కొండేపూడి నిర్మల

## చేదు చెట్టు

తిని పారేసిన అరటి పండు తొక్కలా
గీసి విసిరేసిన అగ్గిలేని పుల్లలా
గోడవతల చేదుచెట్టు
అందిన కొమ్మనల్లా పొయ్యిలోకి నరికేస్తుంటాం
అయినా పాపం గాలి వేదుతూనే వుంటుంది
రెక్కలు ముక్కలు చేసుకుంటూ
కళ్ళెత్తి చూశానంటే
తలపాగా పక్కన పెట్టి 'నీ బాంచను దొరా'
అంటూ వినయంగా నుంచునట్టు
అరుబైట వాలుకుర్చీలో కూమని సిగరెట్టందుకోగానే
చివ్వున ఒక నక్షత్రాన్ని వెలిగించి యిచ్చినట్టు
అదొక గమ్మత్తైన అనుభూతి.
ఎంత తపస్సు చేసినా పెన్సిల్తో కాయితమ్మీద గియ్యలేని
ఆ కొమ్మల గజిబిజి
యిట్టే ప్రింటుచేసి అట్టే పెడుతుంది అక్కడ
నువ్వేకదా నా జవం జీవం ప్రాణం అనుకుంటాను
గాలాడని నా అద్దె కొంప కుంపట్లోంచి
తియ్యని ఫలాల నివ్వడమూ
చక్కని పూలు పుయ్యడమూ
వృక్షలక్షణాలైతే
కట్టెగా కాలి తీరాలని తీర్పు యిచ్చుకున్న చెట్టుయిది
ఆకూ పువ్వూ పిందే కొమ్మా అంతా చేదే
నాలిక్కి తగిలితే చాలు ముఖమంతా చిట్లింపే
చెట్టంత చేదుని చేదుకుని కూడా
చిగురించడం మానదు చిత్రం
చిగురించడ మంటేనే జీవించడం

బావులా బతకడం
బతుకుతూ బావడం
దానికి తెలీదు మనకు తెలిసినట్టు
చైత్రం వచ్చినప్పుడు చూడాలి
ఎప్పుడూ కట్టుకునే లంగోటీకి బదులు
పువ్వుల బుష్షర్టూ పచ్చలుంగీ చుట్టుకుని
అలవాటు లేని అదోరకం అతి ముస్తాబుతో
నా నవ్వు పూర్తయే దాక ఆగి
లగ్గం కుదిరిందండయ్యా
అని చెబుతున్నట్టుంటుంది.

* * *

"నాలో నేను చిత్రించుకున్న
కాలమూ దూరమూ లేని పటం
నువ్వూ, నేనూ, గదీ, ఎండా
అందం, ఆకాశం, అంతా
నాలోని చిదాకాశం
అంతటా నేను
నా హృదయంలోని తేజస్సు
మహోదర్పణ కోణాలలో
పీలికలై రంగులై చింది
ప్రపంచంగా రూపొందింది...." —చలం

# తుంగిరాల సుబ్బారావు

## మహిషాసురుడు

1

కాలం కీకారణ్యంలో
క్రౌర్యం ఘనీభవించి
మూర్ఖత్వం కండలు పెంచి
శుక్లపక్ష చవితి చంద్రులు వాడి కొమ్ములుగా
శుక్రతారలు రెండు కళ్లగా
నఖశిఖ పర్యంతం కప్పిన అజ్ఞానం నల్లని ఒళ్లగా
మండే మధ్యప్రాచ్యం ఇసుక గుట్టల్లో
ఓ మహిషాసురుడా ! నీ పుట్టుక.
దుర్మదం పెచ్చు పెరిగి
దౌష్ట్యం హెచ్చి హెచ్చి
నింగిని చీల్చే రంకెలువేస్తూ, ఖర్జూరపు చెట్లు కూలుస్తూ
ఎడారులు దాటి, బిడారులు దాటి
ఆర్యావర్తంలో అడుగుపెట్టావు
అమాయకుల పొట్టలు చీల్చిన నెత్తుటి కొమ్ముల చంద్రుణ్ణీ
అసూయా ద్వేషాలు నిండిన చూపుల చుక్కల్నీ
జెండాగా ఎత్తిపట్టావు, మా మీద బుసలు కొట్టావు
నీ గిట్టల కత్తుల క్రింద
పుణ్యభూమి బ్రద్దలై భోరున ఘోషించింది—
నెత్తియల వేలాది నోళ్లతో
దోచుకోబడ్డ ఊళ్లతో
చెరచబడ్డ పతివ్రతల కన్నీళ్లతో
మంటల కోరల్లో పడ్డ ఇళ్లతో
కాళ్లూ చేతులూ విరచబడ్డ దేవుడి గుళ్లతో....

2

నా చేతిలో చెట్టు కొమ్మలున్నప్పుడు— నీ చేతిలో విల్లమ్ములు

నా చేతిలో విల్లమ్ములున్నప్పుడు – నీ చేతిలో కత్తులూ కటార్లూ
నా చేతిలో కత్తులూ కటార్లూ ఉంటే— నీ చేతిలో తుపాకులూ తూటాలూ
మట్టిబురుజుల మాటున నేను— మరఫిరంగులు పేలుస్తూ నువ్వు
నేను ఏనుగు నెక్కితే నువ్వు గుర్రాన్నెక్కావు
నెగ్గితే తరుము కొచ్చావు – ఓడి పోతే పారి పోయావు
నేను యుద్ధభూమికి వెన్ను చూపను
ప్రాణం పోయినా నీతి నియమాలు విడువను
ధర్మాధర్మాలతో నీకెప్పుడూ పని లేదు
నమ్మక ద్రోహమే నీ రక్తంలో నిలువెల్లా పారే కుళ్ళునది
ఓరి పచ్చి అవకాశవాదీ! వట్టిగాలి వాటు నీది.
మంచి— చెడునీ
నీతి —అవినీతినీ
ధర్మం—అధర్మాన్నీ
ఎప్పటికైనా జయిస్తామన్న నా నమ్మకమే
దసరా అంటించిన దెయ్యం బొమ్మల మంటల్లో మెరిసింది
పేలిన బాణసంచా పిడుగుల్లోంచి పెఠిల్లున కురిసింది
నాది వెర్రి నమ్మకమని నీ చరిత్ర నిరూపించింది
నీ ప్రవర్తన పరిహసించింది
కుత్తుకలు కత్తిరించి, కత్తుల వంతెనల మీంచి నడిచి
కులాల అనైక్యంతో కొట్టుకు చచ్చే మా నెత్తినెక్కి తొక్కావు
గర్వంతో నిక్కావు
మా ప్రాణాలు స్త్రీలమానాలూ
నీ కొమ్ముల శూలానికి గ్రుచ్చి ఎగరేశావు
మా గుళ్లూ గోపురాలూ నీ కళ్లల్లో విరిగే ముళ్లు
మా తరతరాల ఆచారాలు నిత్యం నీ నోట్లో నానే తిట్లు
మా పవిత్ర పూజా విగ్రహాలు నీ ఎడమ కాలిక్రింది మెట్లు
మా సిరిసంపత్తులు నీ తాతగారి సొత్తులు
కంఠం మీద కత్తి పెట్టి బెదిరించి
మాలో కొందర్ని నీలోకి లాక్కున్నావు
మీ అందరూ కలిసి మళ్లీ మా గుండెల మీద మృత్యుతాండవ కేళి!

3

శతాబ్దాల ఉలుల అనుభవంతో శిల్ప నైపుణ్యాన్ని పట్టి
ఈ భూప్రపంచంలో ఏ కంటి పాపా చూడని అందాన్ని ప్రోవు పెట్టి
అద్భుత హంపీ విజయనగరంగా ఆవిష్కరించాను.
శ్రీకృష్ణదేవరాయల్ని సాహితీ సమరాంగణ సార్వభౌమునిగా స్థాపించాము.
మా కన్న పిల్లలకు ఆ చల్లని వల్లభుని పేరు
మా గ్రంథాలయాలూ విశ్వవిద్యాలయాలూ ఆ ఆంధ్రభోజుని విలాస విహార
భూములు
మా అష్టదిగ్గజ కవిలోకం ఆయన భువన విజయ భుజకీర్తులు
మా సాహిత్య చరిత్రలో రాయలయుగం స్వర్ణయుగం
కృష్ణరాయల పేరు చెపితే ఒళ్లు పులకరించని వాడు లేడు
ఉంటే వాడు తెలుగువాడు కాడు!
అలనాటి విద్యానగర సిరి సంపదలు
సౌందర్యాలు సౌగంధ్యాలు సంగీతాలు సంతోషాలు
నృత్యాలు సాహిత్యాలు సౌహిత్యాలు
వజ్రవైడూర్యాలు నడి వీథుల్లో నవ రత్నాలరాసులు
బంగారు కాసులు, చూసిన పోర్చుగీసు కనుల ఊసులు
రాయరాణువ శౌర్య సాహసాలు
దసరా కనక దరహాసాలు....
కాని
ఓ మహిషాసురుడా!
నువ్వు
నీ రక్కసి మూకనంతా కూడగట్టుకొని ఎదిరించి
ఓడి పోయి కాళ్లమీదడి
క్షమించిన ఆ కాళ్లు పట్టి లాగి
సంధికి వచ్చిన రాయబారిగా నటించి చటుక్కున దాడి చేసి
అన్నం పెట్టిన చేతికి సంకెళ్లు వేసి
పెంచిన తండ్రి తల కొట్టి జెండా కర్రకు కట్టి
మతోన్మాదం రెచ్చగొట్టి మారణహోమం చేశావు
గునపాలతో గొడ్డళ్లతో ఘోర హత్యలతో
రణరంగాలతో మానభంగాలతో
ఆరునెల్లు కొల్లగొట్టి నెత్తుటి మడుగులు సృష్టించావు

వర్ణించడానికి మాటలు చాలని సౌందర్య సీమను
క్షణంలో వల్లకాడుగా శిథిలాల బీడుగా మార్చావు....
వందలాది ఏళ్లుగా చెక్కిన అపురూప శిల్పాలు
నీ వాడి కొమ్ముల కుమ్ములతో
రాళ్లుగా రప్పలుగా
ముక్కలుగా చెక్కలుగా
ఎప్పటికీ ఆరని
నా జాతి కన్నీటి చుక్కలుగా....మిగిల్చావు....
చరిత్ర నెత్తుటి వ్రాతలు కన్నవాడు
పెయిస్, న్యూనిజ్, న్యూయల్ ప్రత్యక్ష కథనాలు విన్నవాడు
ఎన్ని శతాబ్దాలకైనా నిన్ను క్షమించ లేని వాడు....
విస్మృత మహా సామ్రాజ్యాన్ని పగిలిన గుండెల్లో
చితాభస్మంగా భరించే వాడు
పీడ కలల కంటక కిరీటాన్ని ధరించే వాడు....
దుర్గకు ఎన్నిదున్నలు బలియిచ్చినా
అవి మళ్లీ మళ్లీ పుడుతూనే ఉంటాయి
మెలి తిరిగిన కొమ్ములతో మమ్మల్ని కుమ్ముతూనే ఉంటాయి.

4

భారతానికి గ్లాని వచ్చినప్పుడు
సాధువుల పరిత్రాణంకోసం, దుష్కృతుల వినాశం కోసం,
'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే'/ప్రతిజ్ఞా బద్ధుడైన
మాదేవుడే
కృష్ణరాయలుగా రాణాప్రతాపుడిగా
శివాజీగా నేతాజీగా భగత్‌సింగ్‌గా
ఆజాద్‌గా వీర సావర్కర్‌గా అల్లూరి సీతారామరాజుగా
ఉరి కంబాలను వరించే వేలాది అడవి వీరులుగా
నారక్తంలో పొంగే ప్రతీకార జ్వాలగా
నా క్రోధారుణ మందార మాలగా
ప్రచండ చండి భయంకర జిహ్వాపల్లవంగా
పన్నెండు చేతుల భద్రాయుధాలుగా
నీ కుత్తుక మీదికి దూకుతున్నాడు....

ఎప్పటికైనా నీ పొట్టచీల్చి పచ్చి నెత్తురుపట్టి జుర్రుతాడు
ఈ వజ్రపుగోళ్ల ఉగ్రనరసింహావతారుడు....

5

దక్షిణ భారత చరిత్ర కర్ణాట సంగీత గాన సభలో
నిర్నిద్ర తుంగభద్రా తరంగాల తంబుఱ శ్రుతిలో
వీరభటుల కవాతుల తాళగతిలో
రాయల నవరాత్రి మహోత్సవాల దీపక రాగాలాపనలో
విజయనగర వైభవ గంధర్వగానంలో
నాడు మధ్యలో ఆగిపోయిన పురందర కీర్తన
నేడు అందుకుంటోంది మనజనతా ప్రభుత!
చాముండి త్రిశూలం వాడి మొనలూ
చండసింహం క్రూరమైన కోరలూ
మహిషాసురుడి బండ గుండెల్లో బలిసిన కంఠంలో
కరకర దిగబడుతున్న మోత....

(25-10-1988న హంపీ విజయనగరంలో కర్నాటక ప్రభుత్వం జరిపిన దసరా మహోత్సవాల కవిగోష్ఠిలో శ్రీకృష్ణదేవరాయల మంటపంలో చదివిన కవిత)

* * *

"పుటక నీది
చావు నీది
బ్రతుకంతా దేశానిది

(జయప్రకాశ నారాయణ్‌ను గూర్చి కవి కాళోజీ)

# మాదిరాజు రంగారావు

## వర్తమానం అంచులపై

ముందు ఉదయ నభం, వెనుక జనం!
కింద అవనితలం, పద భరితం!
చేతికందే ఆశయై
వ్యక్తి రూపం దారిలో.
కళ్ళలో జన విజయ దృశ్యంతో
గుండెలో రవి తరుణ రాగంతో
సమస్యనుండి నినాదమై
సమాజ శక్తికి రూపమై.
కదలుతోంది కవోష్ణ పవనం
హిమముఖాలకు స్వస్తి చెబుతూ
అణగి ఉన్న ప్రపంచం రవమై
ఎగసి అభ్యుదయంకై స్వరమై
అగ్నిబీజం సుప్తమై
శక్తికి రూపం బొగ్గులో
ప్రగతి బింబం వ్యక్తిలో
నవ సమాజం ఊహతో.
సంఘర్షణ లేంది, లేదు జీవితం.
సంవేదన లేంది, లేదు సాగరం.
సామూహిక శక్తిలో, వ్యక్తి శక్తి నిక్షిప్తం
సంగ్రామ బలాలతో, జీవితం సదా సిద్ధం.
స్క్వేర్ తరువాత స్క్వేర్ సందేహ దిశలతో
నిల్చిన వర్తమానం దారి పొడవునా,
భవిష్యత్తు ఉండనే ఉంది. వేచి
సమాజం చరిత్రలో చుట్టు, పొంచి.
చెట్లపై ఇండ్లపైనుండి దూర భూమి
త్యక్తమై శీర్ణమై కన్పడేను కోట!

పైన రణ విమాన విన్యాసం చూస్తూ
జీర్ణమయిన కోటకై ఏడ్చేవారూ!
శిలవలె నిల్చిన గత శిఖరం చుట్టూ
పవన తరంగితమయి తిరిగే వారూ!
నవ సమాజ స్వతంత్ర గతిలో
నలిగి పోయిన వెన్ని దశలో!
రంగ భూమిపై నటించే పాత్ర
లేవో కొన్ని మాత్రమే ఉంటాయి!
అయినా ప్రజ అపుడపుడూ ప్రత్యక్షంగానే
ప్రతి పాత్రను మలపులతో నిర్వర్తించేను.
నిన్న ఊగే పంజరంనుండి విడుదలై
నేడు మ్రోగే శృంఖలాల్లో పదయుగళం
ఏదో ఒక ప్రశ్నతో
సంకీర్ణ సమస్యలో!
ముఖబింబం ధూళి గణంలో చిక్కి
హృదయం సంధ్యా గగనంలో దూకి!
జీవితం ఆటోమేటిక్ యంత్రం కాదు
శాంతిలోనూ యుద్ధంలోనూ కావాలి,
ప్రేరణతో వివేకం
మానవతా ప్రమేయం!
భవిష్యత్తు దిశ చూపిన సంఘర్షణలో
సమాజాన్ని పరివర్తనకై ప్రేరణతో,
క్షణాలు కదలి పోతున్నాయి బెలూన్‌ల వలె
నిజాలకు కలలేవో! క్రమ్మిన కాంతులతో.

వర్తమానం చివరి బిందువునీ
ముందు కాలం మొదటి బిందువునీ
కలుపుతుంది అనుభవం నిరంతరం
మనిషి భౌతిక గతిలో అఖండమై.

## శ్రీమతి చెళ్ళపిళ్ళ వెంకటరమణ

### ఉయ్యాల

ఒంటరి తుమ్మని వెక్కిరిస్తూ
జంటగా ఆవలిస్తోంది నీ శరీరం
మబ్బుతెరల్లా నాట్యం చేస్తూ
మత్తుగా మగతగా
నీ కనురెప్పల మీద
సోలిపోతూ వుంటుంది నిద్ర.
    పసిపాపలా పారాడుతూ
    ఒళ్ళంతా గిలిగింతలు పెడ్తూవుంటుంది
    ఆవలింతల ఉయ్యాలలో
    జోలలూపుతూ వుంటుంది.
చీకటితో చేయి కలుపుతూ
చెమ్మ చెక్కలాడుతూ వుంటుంది.
    అర్ధరాత్రి అయినా
    ఆరు బయటయినా
    అందరిలోనూ నిన్ను
    సిగ్గులేకుండా కౌగిలించుకుంటుంది.
చిరుత పులిలా గురకలు పెడ్తున్నా
చొంగలు కారుస్తున్నా
అసహ్యించుకోదు నిన్ను.
    పట్టు పరుపులైనా
    రాళ్ళ గుట్టలైనా
    చెట్టు నీడనైనా
    చెత్తకుండీ ప్రక్కనైనా
    మొహమాటం లేకుండా
    నీకంటి గువ్వల గూడులో
    ఒదిగి పోతూ వుంటుంది.

అలసిన శరీరాన్ని
ఆత్మీయంగా అక్కున చేర్చుకుని
కన్నతల్లిలా తన ఒడిలా
సేద తీరుస్తుంది.
నీకు తెలీకుండానే నీ కళ్ళని
హిప్నటైజ్ చేస్తు
కంటి గుహలలోకి
దూసుకుపోతూ వుంటుంది.
కంటి చక్రాల ఇరుసుల్లో
ఇంధనంలా ఒరుసుకు పోతూ వుంటుంది
నిండుగా నవ్వుతూ
నిలువెల్లా ప్రాకుతూ
మత్తు ఇంజక్షన్ ఇచ్చేస్తుంది.
నిద్రలో నీ శరీరం
ప్రాణమున్న శవంలా
కదలాడుతూ వుంటుంది
పిడిబాకు గుండెల్లో దిగినా
నాగుపాము కాటేసినా
క్షుద్ర శక్తులు ఎత్తుకు పోయినా
పెనుతుఫాను వరదలై ముంచెత్తినా
నువ్వు తెప్పలా తేలి పోతావే తప్ప
తన టక్కరి వలలోంచి
నిద్ర నిన్ను మేల్కో నివ్వదు.

* * *

"భూతల రంగమందున సౌదామిని
కరణి రగులు కవన భామిని
కవుగిలి, అనంత పరిశోధన
అది జన్మ జన్మాల సాధన" —పఠాభి

# పి వి జి

## తన వయస్సు

తన వయస్సు ఎంతని ప్రశ్నించాడు
ఘడియ విఘడియలతో సహా
పుట్టిన రోజు రికార్డు చేయించిన
అమ్మ నాన్న నమ్మకంగా చెప్పారు
పెద్దలచే భర్తీ చేయించాంనీ బర్తు సర్టిఫికెటు
జన్మగ్రహాల వ్యవస్థను లెక్కలు కట్టించాం
నీకెందుకీ అనుమానమని ఎదిరించి అడిగారు.

తన శరీర సౌష్ఠవం ప్రతి రోజూ మారుతోంది
తన భావాలు రోజూ మారుతూ గంతు లేస్తున్నాయి.
రాలిపోయిన వెంట్రుకలు విసర్జించిన కల్మషాలు
పొరలూడిన చర్మం పొడవెదిగిన గోళ్లు
ఇవికాక తనలో మిగిలిన దెవరు?
తన చిన్న తనానికి పూర్వం తనకున్న అవస్థ ఏమిటి?
తిక మక పడ్డ మనస్సుతో తిష్టవేసి కూర్చుని
తన వయస్సు ఎంతని తపస్సు చేశాడు.

మెదడులో న్యూరానుల్ని గుండెలో మాలిక్యూల్సుని
రక్తంలోని కణాలని చర్మంలోని స్వేద బిందువుల్ని
ప్రతి ఒక్క దాన్ని పేరుపెట్టి అడిగాడు.
మీ వయస్సూ నా వయస్సూ ఒకటేనా కాదా?
తుదిమొదలు తెలియని తమకాల పరిమాణం
నోరులేని జీవకణాలు చెప్పలేక తిక మక పడ్డాయి.
"టైము లేదు బిజీగా ఉన్నాం మమ్మాపు వేసి మాటల్లో పెడితే
నీగతి మూడుతుంది."

కరుడు కట్టిన అహంకారంతో
పట్టువదలని మనస్సుని కట్టి
అతి సూక్ష్మ రూపంతో
తన శరీర పరమాణువుల వెదుర్కొని
"మీ వయస్సు వాదేవా
నా వయస్సు మీకు తెలుసా?"

ప్రాధేయపడ్డాడు
చతుర్విధ మహాశక్తుల సంవిధానంలో
అహర్నిశం మహత్ శక్తిని అనుభవించే
ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు, అణుకణాలు
ఎగాదిగా చూసి గెట్ లాస్టు అన్నాయి.
జాలిపడిన ప్రోటా నొకటి
మర్యాదగా చెప్పింది
"నేనెరిగినంతకాలం నేనిలాగే ఉన్నాను
ది ఈవెంట్ ఆఫ్ బిగ్ బేంగ్
నా ఉనికికి ప్రారంభం.
నాలో భాగాలున్నాయని
నన్ను పొడిచి కదిపి
కనిపెట్టారుట కటిక మానవులు"
వ్యథను చెందిన మనస్సుతో
మళ్లీ తపస్సు ప్రారంభించాడు.
కేంద్రీకరించిన మనస్సు
అతి సూక్ష్మ రాగ విశేషమై
అంతర్ధానమయిందణు లోకంలో.

ప్రోటానుల పటాటోపం
పటాపంచలయింది,
రహస్యం బయట పడింది.
శాశ్వత బంధిత రేణువులు
క్వార్కులు గ్లూ ఆనులు
గుక్క తిప్పుకోకుండా

అష్టావధానం చేస్తున్నాయి
ప్రోటాను అంతర్భాగంలో.
విరామం లేని ఆరాటం
నిరంతర చంచల సమన్వితం
ముందు వెనుకలు తుదిమొదళ్లు
తెలియని భరతనాట్యం
నీ వెవరవని నీ వయసెంతని
ఎవరినడగటం?
శాశ్వత చైతన్యంలో వయస్సుకర్థం ఏమిటి?
నిస్పృహతో నిరాశతో
తనకు తెలిసిన లోకం
తన మామూలు సదస్సు
చేరుకుని సర్దుకున్నాడు.
తన తపస్సుకి ధ్యేయం
తన వయస్సు కాదని
తన మనస్సుకి శాంతని
తను గ్రహించి గుర్తించాడు
తన మనస్సు ఎవరని
తపస్సు ప్రారంభించాడు.

   

"ఈ సీమల కోమల భావాలు ఎవ్వరూ వాసన చూడని పూలు;
ఇక్కడి చెట్ల తలల్ని చేతులతో ముట్టుకోలేము
చూపులతో తప్ప—

ఆకాశపు కాగితం మీద కుంచెల్లా గీస్తున్న చెట్ల గుంపుల మీదుగా ఒక విశాల ధవళ మేఘం దొర్లిపోతూ ఉంటుంది. పెద్ద పెద్ద అంగ లేసుకుంటూ"

— శేషేంద్ర

# రాజేశ్వరి దివాకర్ల



సీత
అశోకమంతటి
మనసు నాటుకొంది
ద్రౌపది
కేశ పాశాలలో
విప్పిన
పాముపగను
రక్తంతో తడిపింది
అబల
లతవంటి
తనువులో
వృక్షమంతటి సిద్ధి పొందింది
సతిగా
చితి మంటలలో
చల్లారాలని
పతివ్రతగా
పాదపూజలు చేయాలని
అర్థం కాని
చిత్రంగా
ప్రదర్శనలో ప్రశంసలు పొందాలని కాదూ
తానురూపు దిద్దుకొన్నది
బిందువై మేఘ గర్భాన ధరించి
భవితవ్యానికి నదియై
సాగరంతో జతకలవాలని.

## వి. ఆర్. విద్యార్థి

### మదీయ కామన

బ్రతుకు చీకట్లను
కవితా కిరణాలతో
ప్రభవించాలనీ,

మనసు పూదోటను
మమత చంద్రికతో
నింపాలనీ,

విముఖ దృగ్విహంగాల
సుందర సరస్సుకు
మళ్ళించాలనీ,

విచలిత చిత్తరంగాలను
శాంతి ద్వీపంలో
ఓలలాడ్చాలనీ,

ఖేద హృదయాగాధల్లో
మోద చేతనాన్ని
కురిపించాలనీ....,

# రామా చంద్రమౌళి

## అరణ్యంలో వేకువ

తట్టలో రాళ్ళు నింపుకుని నెత్తికెత్తుకుంటూ వణుకుతున్న
నిండు చూలాలిని చూస్తాను
నిప్పు సముద్రాలు నరాల్లోనుండి కన్నుల్లోకి అశ్రువులై చిమ్ముకొస్తాయి,
చెమట చేతులతో ఈ నేలను చీల్చుతూ
ఈ పొలాలలోకి నదులను లాక్కొస్తున్న
పదేళ్ళ పసి కార్మికులను చూస్తాను
పాదాల పాదుకున్న శూలాలై
పిడికిళ్ళు ముడి పడ్డ మంటల్లా గర్జిస్తాయి,
చిరిగిపోయిన జెండాను
ఒంటిపై కప్పుకుని స్పృహ తప్పిపోయిన వృద్ధ బిచ్చపుగత్తె కనిపిస్తుంది
గొంతును చీల్చుకుని కేకలు....
కేకలు ప్రశ్నలై ఈ ఆకాశాన్ని ప్రశ్నిస్తాయి
ఈ ఖాళీ రోడ్లపై
తిరుగుతూ పోయే రూపాయ నాణేల వెనుక
గుంపులు గుంపులుగా పరుగెత్తే జనం కనిపిస్తారు
గుండెలు పగిలిపోయే నవ్వుతో
కళ్ళ నిండా నీళ్ళొస్తాయి—
వీళ్ళ వెనుక
క్రికెట్ ఆట చూడ్డానికి వెళ్ళిన లక్షల మంది పనిముట్లు
బోసిగా కనిపిస్తాయి ఏడుస్తూ
యంత్రాలు మౌనంగా తలవంచుకు నిలబడ్డం కనిపిస్తుంది
ఒట్టి శూన్యం మరణంలా మనసునిండా ఆవరిస్తుంది
మేధావులేమో బార్లలో, బ్యాంకు ఖాతాల్లో
పుస్తకాల పుటల్లో, ప్రియురాండ్ల కౌగిళ్ళలో
సమాధై మూల్గుతుంటారు
చరిత్ర ఖాళీ పేజీలను కప్పుకుని

నగ్న శిశువులా నవ్వుతూంటుంది—
జైలు కటకటాల వెనుక బంధించబడ్డ
రుద్రులు, వీర భద్రులు
గర్జించే చూపులతో దోచుకోబడ్తున్న దేశాన్ని చూస్తుంటారు
ప్రజలేమో చేతుల్లో ఓటుతో
శిలువ మోస్తున్న క్రీస్తులా నడచి పోతుంటారు
దుఃఖం
ఎండిన ఆకుల వర్షంలా పైన కురిసి కురిసి
సమాధి చేస్తూంటుంది—
యింకెప్పుడో వేకువ
ఈ కీకారణ్యంలో—

*　　*　　*

"తూర్పు తెల్లారింది! వాన వెలిసింది! అమ్మ
పోయే మందెట్టుకు రాయే!
కాండబ్బైనా లేదు, కాసైనా లేదు! కాత్తె
కూత్తెకైతే డాక్టేరు రాడే.
సందేళ సలిజరం ఊర్కె పోదే, సందొచ్చిన
పిల్లోడు ఉలుకుతుండాడే,
ఏ యాకో తింటుంది గజెట్టీ కుక్క, నేపాళం
మాత్రయ్యే, లేత్తాడు పిల్లోడు.
పాతాళం బలిసెక్రవర్తీ! సంకురాతిపం
డక్కు నేపాళం సెట్టికిక్కరా, జబ్బులన్నీ పోతాయి."

—శిష్ట్లా ఉమామహేశ్వరరావు

# సుమనశ్రీ

## అక్షరాలు రాల్తున్నాయి

రాత్రంతా డిలాన్ థామస్‌తో
    ముచ్చటిస్తూ గడిపాను
పార్కులో గ్లాసుకీ గ్లాసుకీ మధ్య
    పకా పకా నవ్వుతో మాట్లాడుతూంటే
డిలాన్‌తో సమయం బాగానే గడిచింది
తెల్లారి ఇల్లు చేరిన్నేను ఎలా
    నిద్రపోయానో తెలీదు
ఆకాశంలో అడ్డదిడ్డంగా ఇంద్రధనుస్సులు
    అటూ ఇటూ పరిగెడుతున్నట్లూ
సముద్రాల్ని కుదిపేస్తూ
తుఫాను భోరుభోరున వర్షిస్తున్నట్లూ
ఆకారం ఆవలి వేపుకు
    కవులంతా ఎగిరిపోతున్నట్లూ
విచిత్రంగా దండెత్తాయి వికృతమైన కలలు.
డిలాన్ వినిపించిన గీతాలేవీ
    నా కర్థం కాకపోయినా
నా చెవుల్లో మాత్రం అవి
    శ్రావ్యంగానే మ్రోగాయి
అస్పష్టతకి కూడా ఒక
    అందముందనిపించింది
అర్థం కాని డిలాన్ అమాంతంగా
నన్నెత్తుకుని మబ్బుల్లోకి పరిగెత్తాడు
ఎటు మోసుక పోతున్నాడో తెలీలేదు
ప్రజలకీ ప్రజా సమస్యలకీ దూరంగా
    తీసుక పోతున్నాడు నన్ను
చీకటి తప్ప ఆప్యాయంగా
    ముచ్చటించే వాళ్ళే కన పళ్ళేదు

ఆకాశంలో అస్థిపంజరాలకు రంగులేస్తూ
శ్మశానాల్ని నిర్మిస్తూ
మృత్యు గీతాలు పాడుకుంటూ
అజంతాలూ వేగుంటలూ
అకస్మాత్తుగా కన్పించారు
వొంటరితనంతో బాధపడ్తూ కూడా
వాళ్ళు నావైపేనా చూళ్ళేదు—
నా కెందుకో కంపరం పుట్టింది
ఆ అస్పష్ట ప్రపంచంలో నాకు
ఊపిరాడ్డం మానేసింది
నాకూ ఆత్మహత్యే గత్యంతరమేమోనని భయమేసింది
భూమ్మీది మిత్రుల్ని ఒక్క సారి
ఎలుగెత్తి పిలిచాను
నీటినీ నిప్పునూ కౌగిలించుకోవాలని తపన పడ్డాను
సముద్రపు తీవ్ర కెరటాల మధ్య
నృత్యం చెయ్యాలని ఉబలాట పడ్డాను
ఉద్యమం ఊరువుల మీద అమాంతం ఎగిరి పడ్డాను
రగుల్తున్న అసంతృప్తి అగ్నిశిఖల మధ్య
జీవితం రాలుస్తున్న అక్షరాల్ని ఏరుకుంటూ
ఊపిరి కవితలు వ్రాసుకుంటున్నాను
మంచు మబ్బుల్ని ఛేదించుకుని
సూర్యుణ్ణి ఇంట్లోకి ఆహ్వానించాను
అవిశ్రాంతంగా అక్షరాలు రాల్తున్నాయి ...
అదే పనిగా అక్షరాలు రగుల్తున్నాయి....

** ** ** **

"నిశ్శబ్దం కూస్తున్నది
గుండెమీది బరువులాగ
నవనాడుల తీగెలూగ" —బైరాగి

## కవులూరి గోపీచంద్

### రంగుల సంగీతం

ఆమె—కుర్చీలో కూర్చొని అలా చూస్తూంటుంది
చెట్టు కొమ్మల మధ్య కొట్లాడే గువ్వల్ని.
నిన్ను, ఇన్నాళ్ళుగా బ్రతికిస్తున్న తెలివి చెప్తుంది చూచాయగా
ఆ పుష్ప నేత్రాల్లో కదలాడే జీవరసం గురించి.
రెప్పలు వాచుకుని అధోముఖంతో చూస్తుంటావు
అందుకే ఆమె వైపు.
నీ బ్రతుకు నీకు నేర్పుతుంది ఈ కింది సూత్రాల్ని
ఒకటి: పైటయిన తర్వాత జారకా పోదు.
రెండు: పెదవయిన తర్వాత పిలవకా పోదు.
స్పష్టంగా నీ పేరే పిలుస్తుంది.
కోర్కెల కుష్ఠుతో కరిగిపోతున్న వేళ్ళతో
        పైటని సర్ది ఇంటికొచ్చేస్తావు—
చంద్రుడు కొండ మించి కొండ మీదికి ప్రయాణిస్తాడు,
ఈ లోగా నీలో చెల రేగుతున్న రంపాలకు ఆమెను రాసేస్తావు.

*        *        *        *

నీ పాపాల లోయల్లో ఊరి తీయబడ్డ స్వరమేదో చెప్తుంది
        ఈ రోజు ఆమె వస్తుందని,
        గదినిండా ఒక్కటిగా వెన్నెల.
నిండయిన వెండి జరీలో వస్తుంది—ఆమె—
వక్షోజాలనుండి ఒలికి పోతున్న ప్రేమతో
        ఏమేమో చెప్తుంది.
నిన్ను కౌగిలిలో నిలుపుకుని కాపాడుతానంటుంది.
నీలో లోలోన కాలే అవయవాల కావిరి కంపు నీకు,
అయినా, చెదరినా ఆమె కుచ్చిళ్ళను సరి చేస్తూనే ఉంటావు.

హఠాత్తుగా ఆమె—
వెళ్ళిపోయిన తర్వాత
గుమ్మందగ్గర నిలబడి 'కుయ్యో' అని అరుస్తావు.
కుక్క విశ్వాసం మరి నీ ఆదర్శం
మనిషివైతే, కనీసం మోసమేనా చేసి ఉందువు.

* * * *

మృత్యు వాసంగే
మాతృ కరమ్ముల
విధవ కానుపు పెదిమల
వెలుగై వెలిగి
నలుపెక్కిందీ సంధ్య

ఖేదంరేపీ, రోదసి నిండి
విశ్వగళమ్మున
హాలాహలమై
విస్తరిల్లినవి చీకటులు

నల్లని త్రాచుకోరలు
తెల్లని మజూచి కుండలు
గగనమ్మున తారలు!

జట్కా గుఱ్ఱం కాలం మెళ్ళో
గంటలు రెండు మ్రోగినవి
చచ్చిన తల్లిశవం
మెళ్ళో గజ్జెల
పట్టెడతో
ఉల్లాసంగా ఆడుకునే
పసిపిల్లాడులా గాలి!

ఒళ్ళు తెలియని
పుళ్ళ బాధతో
వెక్కి వెక్కి ఏడ్చినది
చుక్కల యాకాశం!

సద్యో ఫలితం
విద్యుద్దీపం
వెలుగున
గదిలో

ఖ్యాతి గడించే గీతం వ్రాసి
ప్రేయసి కంకిత
మీయాలంటూ
మూతి బిగించి
చేతులు నులుముతు
కూచున్నావ!!!

'కవీ!'....నారాయణబాబు

## జూకంటి జగన్నాథం

### నేటి తెలుగు కవి

వాలా మందికి మల్లే
ఈ నాటి తరానికి
ఒడ్డున నిలబడి నటించడం తప్ప
నీళ్ళల్లోకి దిగి
రెండు చేతులా ఈదడం రాదు.
జీవితం నదిలో
కవిత్వంలా తేలడం చేత కాదు.

వీళ్ళు
ప్రవాహాన్ని దాటడానికి
పడవనో, స్టీమరోో ఎన్నుకుంటారు.

ఎటొచ్చీ
నది మధ్య ప్రమాదం సంభవించినప్పుడు
జీవన్మరణ సమస్య ఎదురైనప్పుడు మాత్రం
తప్పకుండా తెలుస్తుంది
మనిషికి
ఈత ఎంత అవసరమో
అది ఎంత కష్టమో!
('ఇస్మాయిల్'కు)

# ఎల్. భూదేశ్వర్రావ్

## భాషే దేశమైతే...?

ఆశ్చర్యార్థకాలు
అరుదుగా అగుపించే
ఒయాసిస్సులు—
ప్రశ్నార్థకాలు
పీడిత తాడిత
ప్రజల ముఖాలు—
కామాలు
కార్యాలయాల్లో
సమర్పించుకునే మామూళ్ళు—
ఇన్వర్టెడ్ కామాలు
సమాజంలో
ఇరువర్గాల సంఘర్షణలో
దూయబడ్డ కత్తులు—
సెమికోలన్లు
దేశాన్ని అటు ముందుకీ,
ఇటు వెనక్కీ పోనీయని
రాజకీయ కొజ్జాలు—
బ్రాకెట్టులు
బ్లాక్ మార్కెట్ సొమ్మును
చెరిసగం పంచుకున్న
చీకటి వ్యాపారులూ,
ఆకటి అధికారులూ—
ఫుల్‌స్టాపులు
ప్రభుత్వ సచివాలయంలో
గోడలకు
సుందరంగా ఉరితీయబడ్డ
ప్రగతి పటాలు.

## ఆర్వీయస్. సుందరం

### నగరం నవ్వింది

1. అన్నంలో నంజుళ్ళకే ప్రాధాన్యమిచ్చే
నగర వాసులకు
కవితల్లో మినీ కవితలే మిన్న.

2. నాయకుల మెడలో పూలమాలల్లోంచి
అక్కడక్కడా మిగిలివున్న గాజుల దుకాణాల్లోంచి
కొళాయిల గుండా బొటబొటా రాలుతున్న నదీ జలాల్లోంచి
నగరం నవ్వింది. నగరం నవ్వింది.

3. అడివిని గాచిన వెన్నెలలాగే
నగరంలో వెన్నెలకూ లేదర్థం.
రాత్రంతా కూర్చుని నెలబాలుడు
వెన్నెలతో ఆకాశ హర్మ్యాలకు వెల్లవేస్తుంటాడు.

4. నగరంలో
ఈశ్వరి–చాముండేశ్వరి దేవాలయాలు కావు
చలన చిత్రాలయాలు.

5. దివాకరుడికి
ఫాక్టరీ గొట్టాలు ధూపం వేసి
కొలుస్తున్నాయి.

6. నాగరీకుల కంటికి
నక్షత్రాలు బీడీలు. చంద్రుడు చపాతీ.

7. బాత్‌రూంలో మాఘస్నానం చేస్తున్న
మామగారు
కాఫీ లేకుండా ఆచమనమేం చేస్తారు.

# దేవరాజు మహారాజు

## కాంపస్ కిటికీ లోంచి-

అయిల్ పెయింటింగ్ లో
కనిపించీ కనిపించనట్టు
రెండు కాళ్ళు, రెండు చేతుల్ని
వూపుకుంటూ నడిచి వెళ్తాయి
రెండు చక్రాలు ఒకట్రై
మోటరు శబ్దాన్ని విసర్జిస్తూ
గ్రీన్ బెల్ట్‌లో కాలుష్యంలా దూసుకుపోతుంది
బండ బతుకు మీద చెమట పిండుకున్నట్లు
ఓ తల మాటల్ని మోస్తుంది
కసాపిసా బురద తొక్కినట్లు
ఊపిరి తిత్తుల్లో కాళ్ళు దూర్చుకుంటున్న
ఓ సైకిల్ వాలా!

సాలె గూటిలో చిక్కుకుని తన్నుకు ఛస్తూ
బాక్సాఫీసు బద్దలు కొట్టే 'నిరుద్యోగ సినిమా' కోసం
అర్జీలు బాస్తూ, అప్లికేషన్ల టికెట్ల కోసం
ఎగబడే యువ అమాయకత్వం-
ఎక్కడో దూరంగా కట్టని హాస్టల్ బిల్డింగ్స్ వెనక,
జీన్స్‌లోంచి థామ్స్ లాగిన
సన్నని నాజూకు వేళ్ళు విశృంఖలత్వాన్ని
లిప్‌స్టిక్ పెదాలమీద కాలుస్తూ ఆనందిస్తాయి—
డబ్బుతో తల పండిన ప్రొఫెసర్ చిన్నమారుతి
చెడిపోయిన విద్యావిధానపు రోడ్లమీద
పరుగెడుతూ, దభీలు మని గోతుల్లో పడుతూ
లేచి అక్కడక్కడే మెలికలు తిరుగుతూ వుంటుంది—
శ్రమైక జీవన సౌందర్యం గుర్తించని

రాజకీయ జూనియర్లు కొత్తగా వెల్ల వేసిన గోడల్నిండా
ఆచరణలేని సిద్ధాంతాల అస్పష్టతను
వినాదాలుగా పులుముతుంటారు–
అంతా పచ్చగా, ప్రశాంతంగానే వుంటుంది
అయితే అక్కడ వీచే గాలి కనబడదు
అక్కడి సమస్యా అంతే -
ముత్తయిదువ లా వచ్చి ఆగిన ఆర్టీసీ బస్సు;
దుందుడుకు వాదుల కోపతాపాల
ఆకస్మిక మరణంతో....
విధవలా గాజులు పగల గొట్టుకుంటుంది!
(మిత్రుడు టి. కిషన్‌రావు కోసం)



"జగమంతా
కన్నయితే
చీకటి కజ్జలమయితే
నా గీతం
చూపు!
నీవు, నేను
ఈ ప్రపంచ వైతరణి
దాటేందుకు
నీ కోసం
నే చేసిన
గోదానం
నా గీతం."  —నారాయణ బాబు

# ఒబ్బిని

## మెరుపు సంతకం లేని ఆకాశం

నిర్మలాకాశాన్ని కాగితంగా ఇచ్చాను
నిఖార్సయిన సంతకంకోసం—వొణకని వేవ్రాలుకోసం.
సిరా వొలక బోసేస్తున్నారు ఆకాశం నిండా
నల్లని కొండలంత మబ్బులుగా, సంతకాలు పెట్టబోతూ—
ఒక్కో తెర ఒక్కో దృశ్యాన్ని రంగస్థలం మీద మార్చేస్తున్నట్లు
వేసవి విసవిసలు వర్షాకాలానికి
వర్షాకాలం రుసరుసలు శీతాకాలానికి
శీతాకాలం సణుగుడులు మిగతా కాలానికి గుర్తురాక
ఏ అక్షరాన్ని వడివడిగా రాయలేక పోతున్నారు
మందగించిన చూపుతో, మసక మసక జ్ఞాపకాలతో —
ఇక్కడి వర్ణమాల వ్యవస్థలోని
బాల్యం టైం బాంబులని భరించ లేక
రెడీమేడ్ విద్యావస్త్రాల కొలతలు చాలక, ధరించలేక
వలస విషం తాగలేక
పెళ్ళిళ్ల లక్షల పూలని మనసుతో ఆఘ్రాణించలేక
వినోద వ్యాధి టాబ్లెట్లు మింగలేక
భయం రాత్రి మంచం మీద పడుకోలేక
షాక్‌తో స్పృహకోల్పోయి పెన్ను కదప లేక పోతున్నారు.
అడవి గులాబీలని కొండరాళ్లతో చిదిమేసే దృశ్యాలకి
ఇళ్లల్లోని శిరోజాలను
సముద్రపొద్దుకి కొట్టుకొచ్చే చిదుగులుగా మార్చే దృశ్యాలకి
భయభ్రాంతులై తడబడుతూ మారు నిశానులు వేస్తున్నారు.
నిక్కచ్చి సంతకాలకోసం తహతహలాడే నాకు
అతుకులబొంత సంతకాలు అగుపించాయి.
సంతకం (సరిగ్గా) లేని 'బ్యాంక్ చెక్'లా
మెరపుల్లేని ఆకాశం
మన కళ్ళ ముందే కూర్చొని విచారిస్తోంది.

# తుమ్మపూడి కోటీశ్వరరావు

## బిందు పింఛము

నెమలి కనులోని శ్యామ నైల్యముల కాంతి
పులుము కొనె నేమి? సంద్రముం బోలు మిన్ను
సృష్టి కాలమా? యిది ప్రళయేష్టి కృతమొ?
వృష్టియే రెంటికిని మూల మెట్టు లగును— 1

అసిత, సిత కాంతుల సమన్వయాత్మకమ్మొ
హరి తనూనైల్య భద్ర ప్రభార్ద్రత పయి
మత్సరించినటుల్ కారుమబ్బు గుంపు
సిగ్గులేక సకల హరిచ్ఛిద్రమయ్యె. 2

కానుగుల నీడ, గుహయందు కానుపించె
నీలి కల్వగా మఘవ మాణిక్య మొండు
చంద్రికా చంద్రకిత శిరశ్చాలనములు
శంఖనాదముల్-వేణు నిస్వానమగుచు. 3

మోహనవంశి నూద గదవోయి చలన్మృదుమంద్రనాదమై
ఐహిక మెల్ల బృంద వనియై-తరియింపగ, రాసమండల
శ్రీ హననాత్మ వ్యక్తినయి చేడ్పడితిన్ మొరడైన చెట్టుగా
గాహిత వేణురంధ్ర కృతగాన సుధన్ మరుజన్మ నెత్తెదన్. 4

ఎండిన గడ్డిపోచ స్రవియించెను పచ్చలకాంతి నిర్ఝరుల్
ఎండిన రొమ్ములందు స్రవియించెను క్షీరము మాతృతాకృతిన్
కొండల కోనలన్ కుసుమ గుచ్ఛము విచ్చె మధు స్వరూపమై
గుండెలలో త్రివక్ర మధు కూజిత వేణువు లాలకింపగన్. 5

"చైతన్యమను ప్రవేశముగాని కేవల
జడపదార్థమగు కుబ్జయిక లేదు"

ఆకాశమంతయు నావరించినదెదో
తెలినీలి కాంతుల జిలుగు గొడుగు
కదలిక లేనట్టి గ్రావమౌ నాలోన
మధుజలమ్ములు–దుగ్ధ సుధలు చిందు
పెనురాతి చట్టును స్పృశియించి–మలిచిన
భంగిమనోజ్ఞ శిల్పమ్మునైతి

పుల్లనొక్కటి త్రుంచి నీ మోవినుంచు
మదియె పిల్లన గ్రోవియై ఆత్మ మధువు
లోకపుం జట్టు గుండె చీల్చుకొని పొంగి
లోగొనుచు పోవు నన్ను గోలోకమునకు. 6

వర్ష బిందు వొకటి పైనుండి పడినంత
కాస యెల్ల నెమలి కన్నులయ్యె
ప్రాణి కోటి కెదల వనమాలలూగాడె
సకల దిశలు గాన శబలితములు. 7

ఎల్ల వస్తుకోటి ఏదేదొ స్వనియించు
ఏటి సన్న పాయ పాట వోలె
ఏదొ పింఛ కాంతి ఎద కంటి కందును
సుడియు చక్రరీతి–ముడులు పడుచు. 8

* * * *

శాశ్వత నవ్యస్ఫురణల
నశ్వర లావణ్యమై పెనగ, కావ్యకళా
విశ్వమునం దానంద ర
సైశ్వర్యము లేలు కవిత కంజలి నిత్తున్. —రాయప్రోలు

## పోచిరాజు శేషగిరిరావు

### మానసవీణ

తీయని భావనాధ్వని నదించును; మ్రోయును కాంతి ఘంటికల్;
పాయని రక్తితోడ రసబంధుర సుందర వాగ్విలాసముల్
పాయలు పాయలై యొదిగి పారును నా హృదయాంతరీపమం
దాయత రీతి, నా మది సమర్పణమౌను తనంత తానుగా

నీదు గుణోదధిన్ మునిగి నేను చరింపగ గోరుచుండుదున్-
మేదుర సత్త్వభావ రుచి నిర్మలమున్ కవివాక్ప్రసారముల్
ఆదరణీయసార రుచిరార్థములన్ వెలలింప, తన్పుతో
పాడుకొనున్ మనస్సు, రసవత్తరమై సుగుణోత్తరమ్మునై

లాలసలాలితమ్ము ననురాగ రసప్లుత చిత్త వీథిలో
లీలలు, మంద్ర మంద్రము చరింపగ, జీవన మెల్ల తానయై
పాలన సేయు, తద్విభుత పారము ముట్టి సుఖానుభూతి, న
న్నేలును స్వామి! సుంతయు రణింపదు మానసవీణ మూగయై

ఈ బంధమ్ములదెట్టు లేర్పడెనొ స్వామీ! నేర్ప నింతేనియున్
ఏ బాంధవ్యము లేని వీ ముడులు, నూహింపంగ చిత్రమ్ముగా
ప్రాబల్యమ్ము గడించె ఈ భవమునన్, రంజత్ కళా సింధువై
ఏ బీరమ్మును దర్పమున్నిచట వర్తింపంగ రావేలనో!

స్వార్థము లేనిచోట-సుఖశాంతులు వర్తిలు చోట-ధర్మర
క్షార్థము మానవుల్ బ్రదుకులం దమృతమ్ములు చిమ్ముచోట, వే
దార్థములందు సత్య మొకడాంతరమందు చరించువేళ, వి
శ్వార్థము నిల్చుటొక్కడె పసందనిపించును నాకు నెప్పుడున్.

దాని సిగను తరగ- ధనకాంత కనుసైగ
లోగొనంగ జేయు లోలచిత్తు;
ధనముతనకు ప్రీతి దాస్యమ్ము సేయునో!
తానె దాసు డగునొ ధనమునకును.

# శంకరగంటి రంగాచార్యులు

## రాయప్రోలు

(సానెట్)

ఆంధ్రదేశ ప్రజలు ఆధునిక కవితకై
ఎదురు చూచెడువేళ సదమలిన శృంగార
కావ్యములు వారలకు చూరలిచ్చిన వార
లీరు, రాయప్రోలు! మీ కవిత నవతకై,
యువతకై. ప్రవిమలోదాత్త మానవతకై,
రసరమ్య మార్గమున శ్రమియించె మనసార!
ఆంధ్రుల పురాతనపు చరితయందలి సార
మును మీరు సీసముల సీసాల జనతకై
నింపితిరి! మీ దేశభక్తి రసగీతమ్ము
ప్రతి తెనుగువాని నాలుక మీద నర్తనము
చేయు ననునిత్యమ్ము! మధుమాస సుమవనము
పగిది సురభిళమయము మీ మధుర చేతమ్ము!
మీరు నిక్కముగ ఓ కవికోకిల స్వామి!
భావ కవికుల గురువులనుటలో తప్పేమి?

# వాగర్థా....

## ప్రపంచ కవిత్వోత్సవం ప్రత్యేక కవితలు

(1989 జనవరి 11వ తేదీనుంచి 17వ తేదీవరకూ భోపాల్‌లోని భారత్ భవన్‌లో జరిగిన ప్రపంచ కవిత్వోత్సవంలో ఆరు ఖండాలనుంచి ప్రసిద్ధ కవులు పాల్గొన్నారు. వారి కవితల్లో కొన్నిటిని ఈ సంచికలో ఇస్తున్నాము. జపాను. డెన్మార్కు, ఘనా, లెబనాన్, దక్షిణాఫ్రికా, చేకొస్లవేకియా, హంగెరీ, చిలీ, నికరాగ్వా, నైజీరియా, సెనెగల్, ఇటలీ, రష్యా, అమెరికా, ఇండొనేసియా, క్యూబా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా, అంగోలా, చైనా, టర్కీ, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, స్వీడన్, పోలెండ్, దక్షిణ కొరియా, యుగోస్లావియా, స్పెయిన్, గ్రీసు, మెక్సికో, ఆస్ట్రియా దేశాల కవులు పాల్గొన్నారు. హిందీ, ఒరియా, బెంగాలీ, మలయాళం, మరాఠీ, ఉర్దూ. పంజాబీ కవులు కూడా పాల్గొన్నారు. తెలుగునుంచి శేషేంద్ర శర్మగారూ, అజంతాగారూ వెళ్ళారు. 1988వ సంవత్సరపు 'కబీర్ సన్మాన్' స్వీకరించిన పంజాబీ కవి డా. హరిభజన్ సింగ్ కవితను కూడా అనువదించిప్రచురిస్తున్నాము.—సంపాదకులు)

## ఆరు ఖండాల కవితల అనువాదాలు

సుమనశ్రీ అనువాదాలు (ఆంగ్లంనుంచి):

## జోస్ గర్షియా నీటో (స్పెయిన్)

### అర్థం లేని మాటలు

నాకేమీ తెలీదు
మనుషుల మాటల్తో చెప్పేదేదీ నాకర్థం కాదు
ఈ అడవి పేరు కానీ
పైన ఆకాశంలో ఎగుర్తున్న ఆ పక్షుల పేర్లు కానీ
నా కెవరో చెప్పగా నేను మీకు చెబుతున్న
ఈ కథామూలం కానీ—నాకు తెలీదు
నాకున్న ప్రేమకు కూడా పేరు లేదు
ఎంతలా ఉద్రేక పరిచినా
దాన్ని నా ఆత్మ నిఘంటువులో
నేనేనాటికీ కనుక్కోలేను

ఓ పేర్లు పెట్టేవాడా
ఎందుకంతలా కష్టపడతావ్
ఎందుకంత రక్తాన్ని ధార పోస్తావ్
నీ బాధామయ చేతివేళ్ళ మధ్యనుంచి
జర్రున జారిపోయే పేర్లకోసం
ఎందుకలా వెతుకుతావ్
అవి అదృశ్యమౌతాయి జారిపోతాయి.

నువ్వు పేర్లు పెట్టినందువల్ల
పరిస్థితులేవీ బాగుపడవు
నీకిష్టమైతే వాటినే అడుగు—

పిలు, వాటిని తొందరగా పిలు!
అవి అక్కడే వుండి నిరీక్షిస్తున్నా
నీ వెవరివో వాటికే తెలీక పోయినా
నీకే తెలుస్తుంది—
అవి ఎన్నటికీ సమాధానం చెప్పవని.
మరి నీతోనూ రావని.
(ఆంగ్లానువాదం లూయీస్ బొర్న్)

## హరిభజన్ సింగ్ (పంజాబీ)

### వృక్షాన్ని కూడా తీసుకెళ్తూ

నేను వొంటరిగా వున్నాను
ఎడారి కూడా వొంటరిగానే వుంది
ఇద్దరం వొకరిగుండా వొకరం పోవాల్సిందే
మా మంటల్లో మేం కణకణలాడాల్సిందే
ఒకరి మంటలో వొకరం ఇంకా కాలిపోవాల్సిందే
నా వెంట ఓ దట్టమైన నీడ
నాకు తోడుగా వస్తుందని ఆశించాను
నేనొక వృక్షాన్ని పెకలించాను గొడుగులా పట్టుకుందామని
అది ఎండిపోయి చచ్చిపోయిందయింది
ఒక్కొక్క ఆకే రాలిపోయింది
మరణించిన ఆ వృక్షం నీడ ఎంతోసేపు నిల్చోలేదు
నాదైన భూమిలో పెరిగిన వృక్షం వుంది నా దగ్గర
అది అందంగా వుంది, నాలా వొంటరిగానే వుంది.
దాని నీడ కూడా
నా నెత్తిమీద కూర్చొని నా నీడలాగే వుంది.
నా నడక వేగం పుంజుకుంది
ఆకులు పచ్చగా వున్నాయి

నా తల సువాసనలు జల్లుతోంది
నిద్రపోతున్న పక్షులు ఎగిరి పోతున్నాయి
నా శరీరంలోంచి ఒక సాయంత్రం పెల్లుబుకుతోంది
నూతన సూర్యోదయంలా
ఎడారి అగ్నిలో నడిచి పోతున్నాన్నేను.

ఎడారి ఇలా అంది :
"నీ మొక్కల్ని నా మట్టిలో నాటు
నువ్వు చాల దూరం ప్రయాణం చేశావు
నీ నీడలో సేద తీరడానికి సమయం సమీపించింది."

నా వృక్షాన్ని నా మట్టిలోంచి ఊడ పెరుక్కుంటే
ఎండిపోయి చచ్చి పోతాన్నేను
ఆకు తర్వాత ఆకు రాలి పోతుంది
దాని నీడలో కూర్చోక ముందే నేను మరణిస్తాను
నేను ఈ వృక్షాన్ని వెంట తీసుకునే వెళ్తాను
కదుల్తున్న సువాసనలాగే వుండి పోతాను
అయినా కదుల్తున్న చెట్టు నీడలో
ఎవరు విశ్రమించ గలరని ? !
(ఆంగ్లానువాదం గురుబచన్ సింగ్)

## ఆక్టేవియో పాజ్ (మెక్సికో)

### మెక్సికో కమమ

దినం తన స్ఫటికాకృత శరీరాన్ని విప్పుకుంటోంది
సూర్యశిలకి బంధింపబడిన కాంతి
తన రహస్యపు సమ్మెట్లతో నన్ను పొడుస్తోంది
ఒక ప్రకంపనకీ మరో ప్రకంపనకీ మధ్య

నేనొక విశ్రాంతిని.
నా జీవన బిందువు
నిశితమైన నిశ్చలమైన బిందువు
ఒక దాన్నొకటి నిర్లక్ష్యం చేసుకుంటూ
ఖండించుకుంటున్న రెండు చూపులు
నాలోకి వచ్చి కలుస్తాయి
అవి రెండూ జట్టు కడతాయా?
నేను స్వచ్ఛమైన శూన్యాకాశాన్ని యుద్ధభూమిని.
నా శరీరంలోంచే నా మరో శరీరాన్ని చూడగల్ను.
రాయి తళుక్కున మెరుస్తుంది
సూర్యుడు నా కళ్ళని విప్పదీస్తాడు
రెండు నక్షత్రాలు తమ ఎర్రని ఈకల్ని
నా ఖాళీ నేత్రాల గుహల్లో తామే దువ్వుకుంటూంటాయి.
అద్భుతంగా ఒక వలయంలా రెక్కలు
మరొక క్రూరాతి క్రూరమైన పక్షిముక్కు—
ఇక నా కళ్ళు రాగం తీస్తాయి
వాటి పాటలోకి తొంగి చూడు
అలస్యం చేయకుండా
ఇక ఆ అగ్నిలోకి అమాంతం దూకు.
(ఆంగ్లానువాదం ఇలియట్ వీన్ బెర్జర్)

* * *

దేవరాజు మహారాజు అనువాదాలు (ఆంగ్లంనుంచి);

## అలీ అహ్మద్ సైద్ ఆదోనిస్ (లెబనాన్)

### ఆకలి

ఆకలి ఒక అడవిని నాటింది
అశ్రు ఆక్రందనలు అందులో చెట్లయి

ఆకాశానికి ఎదిగాయి
అడ కూలీలు వ్యాపించిన దౌర్భాగ్యపు దేశంలా
శాఖలు! ... ఎల్లెడలా విస్తరించాయి

విశ్వపు పొత్తిళ్ళలో మొగ్గల్లా పెరుగుతున్న
'జన్మించని శిశువుల పంట' విస్తారమౌతోంది
రాను రాను ఈ అడవి బూడిదగా మారుతుంది
ఆపదల గోపురాల నుండి
సన్నని, బలహీనమైన
ఆకలి గొంతులు వినిపిస్తున్నాయి
నిందిస్తూ, శపిస్తూ–నిందిస్తూ, శపిస్తూ
(ఆంగ్లానువాదం సామ్యూల్ హెూజా)

## రోబర్టో జువార్రోజ్ (అర్జెంటీనా)

### కేంద్ర బిందువు

మనకసలు విషయం తెలిస్తే....
ఏదైనా ఒక విషయం, ఎక్కడ పగిలి బీటలు బారిందో తెలుస్తుంది.
ముద్దుల దారం ఎక్కడ పుటుక్కున తెగుతుందో
ఒక చూపు మరో చూపుని ఎక్కడ కలవకుండా వుంటుందో
ఒక హృదయం మరో ప్రాంగణం కోసం ఎక్కడ గంతులేయదో
అక్కడ మనం, ఆ విషయానికి మరో విషయం జోడించొచ్చు
లేదా దాన్ని మొత్తానికే ఛేదించొచ్చు.

మనకసలు విషయం తెలిస్తే....
ఒకటి కరిగి అక్కడ ఎలా మరొకటిగా మారుతుందో
ఎడారి ఎక్కడ వర్షాన్ని కలుస్తుందో
కౌగిలి ఎక్కడ జీవిత స్పర్శను పొందుతుందో
ఎక్కడ నా మృత్యువు నిన్నావహిస్తుందో

అక్కడ మనం ఆ విషయం లోంచి
ఆవిరి ఉద్రిక్తతను లాగెయ్యొచ్చు
లేదా చివరి క్షణం వరకు పాడుకుంటూ వుండొచ్చు.

మనకసలు విషయం తెలిస్తే....
ఒక విషయం ఎక్కడ విశేషమౌతుందో
ఎముక ఎక్కడ మాంసాన్ని విడవదో
దీపం ఎక్కడ మరో దీపానికి తల్లవుతుందో
ఎక్కడ గత మెప్పుడూ గతంగా వుండిపోదో
ఆ విషయాన్ని మనం వదిలేయొచ్చు
లేదా అన్నీ తుడిపేయొచ్చు
లేదా కనీసం, రక్షిత స్థలంలో వుంచొచ్చు.
(ఈ శీర్షిక లేని కవిత ఆంగ్లానువాదం మెర్విన్)

కె. గోదావరి శర్మ అనువాదాలు (ఆంగ్లంనుంచి) :

## హెన్రిక్ నోర్‌డ్‌బ్రాంట్ (డెన్మార్క్)

### ఇక నిన్ను వాడ లేను

నా ప్రేమ కవితల్లో ఒక గులాబిలా
ఇక నిన్ను వాడలేను నేను.
నువ్వు చాలా పెద్దగా, చాలా అందంగా
నిన్ను మించి నువ్వే చాలా ఎదిగిపోయావు.

కేవలం నీకేసి చూడగలను, అంతే—
తన శయ్యను తానే కనుగొన్న నది
అందులోనే తన అందాల్ని తానే
ఆనందిస్తూంటే చూసే ప్రేక్షకుడిలా.

అందులోని ప్రతి ఉరుకు, ప్రతి మలుపు
తుళ్లిపడే ప్రతి చేప, మంచుకప్పిన నీలికొండల

నడుమ మునిగే ప్రతి సూర్య బింబం—
నిజానికి అవన్నీ నావి, కేవలం నావి.

వాటిగుండా నీతోవ నువ్వు చూసుకున్నావు.
ఇక నేను చేయగలిగిందల్లా నీ నిర్మల
జలాల్లో రాలిన పూలు, పత్రాలతో బాటు
నా ప్రతిబింబంకూడా చూసుకోవడం.
ఇంకా చూస్తాను నీ ప్రవాహంలో మునిగిన
పడవల్ని, పాడుబడిన పట్టణాల్ని;
నీ ప్రియులంతా మత్తులై నీ చంద్రకాంతిలో
మునిగి ఏ దూర తీరాలకి కొట్టుకుపోతారో
నా స్వప్నాల్లో మనం కలుసుకునే ఆ మంత్రనగరాలనీ చూస్తాను.
(ఆంగ్లానువాదం క్రిస్టెన్సెన్, టేలర్)

## చోంగ్ హ్యేన్-జోంగ్ (దక్షిణ కొరియా)

### కవిత్వం, వ్యర్థ కవిత్వం

కవిత్వంతో దేన్ని ప్రేమిస్తాం ?
కవిత్వంతో దేన్ని దుఃఖిస్తాం ?
ఏం పొందుతాం, ఏం పోగొట్టుకుంటాం ?

ఏం నిర్మిస్తాం, ఏం పడగొడతాం ?
మృత్యువుని మృత్యువుతో ప్రేమించలేకపోతే,
జీవితాన్ని జీవితంతో ప్రేమించలేకపోతే,
దుఃఖంతో దుఃఖించ లేకపోతే,
కవిత్వంతో కవిత్వాన్ని ప్రేమించలేకపోతే,
కవిత్వంతో ఇక దేన్ని మాత్రం ప్రేమించగలం ?

రాత్రి కురిసే మంచుని ఎవరూ గమనించరు.
ఎవరూ దాని మీద నడవరు. పాదముద్రలుండవు.
అది అలా వుంటుంది: నిశ్శబ్దంగా, నిర్మలంగా
సుందరంగా తనంతట తానే.

* * *

## వస్తువులు కనే కలలు

చెట్టు కనే కల :
చెట్టు తన శక్తిని తాను కలగంటుంది.
తన పత్రాలపై ప్రవహించే
సూర్యకాంతిని చుంబిస్తూ.
చెట్టు తన రక్తాన్ని తాను కలగంటుంది,
భాషిస్తుంది, కురిసే వానమీద
తన రెక్కల్ని రుద్దుతూ.
చెట్టు తన ప్రాణస్పందనని వింటుంది,
గాలి తన హరితశక్తితో
దాని కొమ్మల్ని ఊపేస్తూండగా.
(ఆంగ్లానువాదం ఉచంగ్ కిమ్)

# మెలిహ్ చెవ్దెత్ అన్దె (టర్కీ)

## ప్రేమ

నువ్వు నా చేతిని అందుకున్న వేళ
వనమంతా పులకిస్తుంది,
అత్తిపండు రెండుగా విచ్చుకున్నట్టు.

ఊపిరి బిగబట్టి ముందుకి వంగి
పైకి పరుగులు పెడతాం, ట్రౌట్ చేపల్లా
పైన్ పుడకలు మన వేగాన్ని నిరోధిస్తూండగా.
నా చేతిని వదలకు
నా చేతిని వదలకు....

ఇక మళ్లీ ఎక్కినంతా జారుతాం,
నిశ్శబ్దం ఒక వృక్షంలా భారంగా వంగి
మనిద్దరిలో వేళ్లు పాతుకుంటూ
ఒకటి తర్వాత ఒకటిగా
భూగర్భ జలాలను వెతుక్కుంటుంది.
నీ సూర్యకాంత పువ్వుల్లాంటి వక్షోజాలు
మధ్యాహ్న ఘడియల్లా
ముఖాల్ని వెలుగువైపు మరల్చుతాయి.
నేను నీ ఉభయపార్శ్వాలనూ అధిరోహించి
అవరోహించాలని, ఆకాశ మధ్యానికి ఎక్కదిగే సూర్యుడిలా,
విజయ ద్వారంపై విక్రమించే వీరుడిలా.

మనం మళ్లీ పరుగులు ప్రారంభిస్తాం,
పైకి, పైపైకి. గగన జలాల్ని అందుకోవడానికి.
నేను నిన్ను ముద్దాడితే నువ్వు వొణుకుతావు.
విరిగిన క్షణాల్ని అతికే ప్రేమ కలలు కనదు.
ఈ అడవి, ఈ వేటాడబడ్డ అశ్వపు భవితవ్యం,
కొత్త ఉదయాల ఆకలి పావురాలూ!
మనకి చెప్పుకోదగ్గ పెన్నిధి ఏదీ లేదు.
దాన్ని మనం వలస పక్షుల కళ్లలో చుక్కలాగో
వాటి ముక్కులతో పట్టుకున్న ఒకేఒక్క గింజలాగో
తగలేశాం, సూర్యోదయ సమయాన్నే.
మనకి చెప్పుకోదగ్గ పెన్నిధి ఏదీ లేదు.
(ఇంగ్లీషు హల్మన్, స్వాన్)

వాసు అనువాదాలు (ఆంగ్లంనుంచి)

# మిరొస్లావ్ హొలుబ్ (చెకొస్లొవకియ)

## కంచె గురించి క్లుప్తంగా

ఈ కంచె అనేది
ఫలానా చోటంటూ మొదలూ అవదు
ఫలానా చోట ఆఖరూ అవదు
అదున్న చోట్నుంచీ
అది లేని చోటుని వేరు చెయ్యడం మాత్రం చేస్తుంది
అయితే నేం
ఏ కంచె లోంచీ అయినా
ఏదో ఒక వస్తువుకి దూరే వీలుండక పోదు
గనక కంచే వేరు చేసేది కాదన్న మాట!
ఏవో రెంటిని వేరు చెయ్యాలని సూచిస్తుంది.
అనధికార ప్రవేశం శిక్షార్హం అంటుంది.
ఈ అర్థంలో కంచె ఓ మాట లాంటిది.
ఆ మాట ఆగ్రహాన్ని ప్రకటించేదైనా కావచ్చు
ఒక్కోసారి అనుగ్రహాన్ని ప్రసాదించేదీ కావచ్చు.
(ఇలా అందరికీ అనిపించాలని లేదు)
అందుచేత సరైన కంచె
దేన్నుంచీ దేన్నీ వేరు చెయ్యదు.
ఇదే అసలైన కంచె.
ఇది కవి పలుకులాంటిది.

(ఇంగ్లీషు ఎవాల్డ్ ఓసెర్స్)

## షూతింగ్ (చైనా)

### రెండు కొయ్యల వావ

నా రెక్కలు పొగమంచు వాత పడ్డాయి
గానీ ఈ గాలి నన్ను తొందర చేస్తోంది.
ఓ నా ప్రియమైన తీరమా!
నిన్ననే కదా నేన్నీకు వీడ్కోలిచ్చింది.
ఇవాళ మళ్ళీ ఇక్కడ కనిపిస్తున్నావు
రేపు మనం మరో అక్షాంశం పైన కలుసుకుంటాం.

ఒక తుఫానూ
చేతిలోని లాంతరూ మనల్ని కలిపాయి.
మళ్ళీ అవే వేరే రూపాల్తో
మనల్ని ప్రాక్పశ్చిమాల్లోకి విసిరేశాయి.
ఆకాశపుటంచుల్నుంచి
సముద్రం ఆఖరయే తీరందాకా
ప్రత్యుభయ సంధ్యల్లో
నువు నా దారిలోనే వుంటావు.
నేన్నీకు కనిపిస్తూనే వుంటాను.
(ఇంగ్లీషు తావొలియు)

## షుంతరొ తనికవ (జపాన్)

### విశ్వబ్దం వా తోడుగా

ఎత్తైన పర్వత శిఖరం
ఆకాశంతో సాధించిన సమత
నేను రాయలేని కవిత

నిశ్శబ్దం గురించి రాస్తూ
శబ్దాల కోసం దేవులాడడం నిరర్థకం
అయినా నిశ్శబ్దాన్ని అందుకోవాలంటే
శబ్దాలు తప్పవనుకుంటాను.

చెట్టు
(అదెక్కడున్నా ఒకటే)
దాని ఊపిరి నీడల్లో మాట్లాడుతుంది.

నువు చూసేదే నీ అనుభూతి ప్రాంగణంలోకి అడుగుపెట్టినప్పుడు
మెరుపు ఆత్మ సంయోగంలో ఆమ్రేడితమౌతుంది.
కంటి తెర మీద పడిన దృశ్యం
అక్షరంలోకి తర్జుమా చేస్తే
కాలం కదలకుండా నిలిచిపోతుంది.

(ఇంగ్లీషు విలియం ఐ. ఎలియట్, కజువా కవముర)

* * * *

"ధరిత్రిని నాగలి దున్నితే
అప్పుడవుతుంది అది ఒక దేశం
ధరిత్రిని కలం దున్నితే
అప్పుడవుతుంది అది ఒక ఇతిహాసం
హలం కానీ కలంకానీ దున్నని ధరిత్రి
ధరిత్రి కాదు, కేవలం మట్టి!" —శేషేంద్ర

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : ఆచార్య తంగిరాల సుబ్బారావు

కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : శ్రీ పి. యు. బి. శర్మ

జీవిత సభ్యులు (1988–89)

శ్రీయుతులు

96. ఆచార్య కొలకలూరి ఇనాక్, అనంతపురం
97. రాజారెడ్డి, బెంగుళూరు
98. టి. రామాంజనేయులు, గౌరిబిదనూరు (కర్నాటక)
99. పి. సాంబశివాచారి, కక్కదాసం, ధర్మపురి జిల్లా (తమిళనాడు)
100. సి. నారాయణప్ప, కామనదొడ్డి, ధర్మపురి జిల్లా
101. ఎ. అంజనప్ప, బెంగుళూరు
102. ఎ. మునిరత్నమ్మ, తిరుపతి
103. డా. ఎ. రాజకుమారి, రాజోలు (తూ.గో. జిల్లా)
104. వి. మాధవరెడ్డి, బెంగుళూరు
105. యస్. ఆంజనేయులు, బెంగుళూరు
106. బి. రామమూర్తి, అనంతపురం
107. ఆచార్య కె. వి. కృష్ణారెడ్డి, అధ్యక్షులు, పూనా ఆంధ్రసంఘం, పూనా
108. సి. సరోజినీ రత్నం, బెంగుళూరు
109. డా. సుమనశ్రీ, హైదరాబాదు

## ప్రత్యేక సభ్యులు (1988-89)

68. డా. ఎడ్ల బాలకృష్ణారెడ్డి
69. ఎస్, విజయకుమారి
70. పి. యల్. శ్రీనివాసరెడ్డి
71. డా. ఓగేటి పరీక్షిత్ శర్మ, పూనా

# చైతన్య కవిత

శుక్ల వసంతం  SPRING 1989



'ఆహవరంగం నా హృదయతరంగం'

విప్లవ ఋషి – రుధిరజ్యోతి
శ్రీరంగం నారాయణబాబు
(1906-1962)